# నా దేశం

రచయిత:


శ్రీ జంప చంద్రశేఖరరావు, ఎం. ఏ. బి. యిడి

లెక్చరర్, ఏలూరు కాలేజీ.





పబ్లిషర్సు:

వసుపులేటి బాపిరాజు,

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.

1946

కాపీరైటు ] [ వెల 0-6-0

# I

'ఏమిటది ?'

'............'

'ఆ నల్లని కదిలే నీడలేమిటి ?'

'............'

'నా పవిత్ర భారతమాతృ హృదయ పీఠంపై అలా నెత్తుటిబురద జల్లే యోధులెవరు ?'

'..............'

'పురిటిలో, పొత్తికడుపులో, తల దాచుకునే ఈ పసి కూనను,—పురిటి స్నానం అయినా చేయని నన్నూ,— నాభర్త ఎదుటే చిత్రవధ చేసినా సహించగలను. కాని...పరదాస్యమా? శత్రుపీడనమా ? స్వైర విహారిణి మా భారత మాతకు ఇనుప సంకెళ్ళా ? నెత్తుటితో పాలభాగమున కుంకుమ బొట్టా ? జీవితాలే నీరాజనములా ?...ఎన్నటికీ జరుగజాలవు. ప్రాణాలైనా బలిచేసి మా భారత మాత స్వాతంత్రం రక్షించుకుంటాం. పరదేశీయ దాస్యానికి తలలు వంచం...మారణ హోమానికి బలియైనా మాతృదేవి నిర్మలానందానికి మంగళహారతిని అర్పించం...కడుపులో కన్ను తెరువని బిడ్డలు కూడా కత్తులు తిప్పుతారు. చంకలలో బిడ్డలు సహితం సింహగర్జనలు చేస్తారు. మూడుకాళ్ళ ముసలులు—బొడ్డు కోయని పసికూనలు— పసుపు నిగ్గులారని జవరాండ్రు—భర్తృ పరిరంభణంలో

పరవశమయ్యే ప్రణయమూర్తులు—వారు వీరనవేల సమస్త భారత దేశమే కదిలి శత్రు మారణహోమము చేయదా ?

పిరికి కండలేని బిరుదు మగలను కన్న భరతమాత; పగతురకు వెన్ను జూపని పౌరుష శాలురను కన్న భరత మాత ; తమ కత్తుల నెత్తుటి బొట్టులచే పసిబిడ్డలకు వీరలాంఛనముగ కుంకుమ రేఖల దిద్దిన మహాశూరులను కన్న భరత మాత ; పతిచేతికి కత్తినిచ్చి, చంక బిడ్డను పెట్టుకొని సమరాంగణమున కురుకు వీరమాతలను కన్న భరత మాత ; మా భరత మాత ఈ పిరికిపందల పాదధూళి తల ధరించునా ?

ఎవరు రా అక్కడ ?

' అమ్మా ! '

' ప్రభువెక్కడరా ? '

' వేటకు వెళ్ళా రమ్మా ! అక్కడనుంచి ... '

' ఊఁ చెప్పు... '

' దక్షిణగంగా తీర ప్రాంతమును శత్రువులు ఆక్రమించబోతున్నారట...అందుచేత... '

' అక్కడకు వెళ్ళారా ? '

' చిత్తం... '

' ఓహో ! ఉత్తర దక్షిణ భాగముల నుండి శత్రువులొత్తిడి చేయుచున్నారా ? '

' అవును తల్లీ ! '

' దక్షిణమున ప్రభువు వెళ్ళిన—ఉత్తరము మాట...?'

'అదే అలోచిస్తున్నాం.'

'ఆలోచన......ఎంతవరకు...శత్రుతుచ్ఛ పాదమీ పవిత్ర ధాత్రిపై మోపేవరకా ఆలోచన...? మ్రోయించరా నగారి ... మ్రోయించరా రణభేరీ...లే...'

'వీరులను నడిపే ధీగశిఖామణి ఎవరమ్మా ?'

'నేను...'

'పురిటి స్నానమైనా...'

'మాటాడకు...లక్ష్మీ! కత్తీ డాలు సిద్ధంచెయ్...
రామూ నీవుపోయి యుద్ధం ప్రకటించి వీరులను సిద్ధం చెయ్యి.'

'మంత్రి సైన్యాధిపతులను పిలిపించమంటారా ?'

'అవసరంలేదు. వారిని దక్షిణాదిశయందే ఉండనీయ్.'

'చిత్తం...'

'వెళ్ళు...'

'...............'

'లక్ష్మీ! కత్తి...కత్తి...డాలు......నేడు మన స్త్రీ లోకం అంతా ప్రళయ తరంగాంచలముల భద్రకాళీ తాండవం చెయ్యాలి. రక్తకుంకుమ మోఘాగ్రేసరులకు పంచాలి...'

అబ్బా !

ఇక అడుగు అడుగునా మృత్యుఘోషలే ; అడుగడుగునా ప్రాణతర్పణమే ; అడుగడుగునా రక్తవాహినులే ; అడుగడుగునా పీనుగుల పోగులే ;...మాతా ! భరతమాతా !

2

ప్రత్యణువూ ఇక నెత్తుటిలో పండించుకోందువా తల్లీ ! విడు వగ రాని మైకమున పెనవై చుకొను సతీపతు లిక విడిపోదురా ! తమతీయ చనుబాలు కుడిపించి, లాలించి, పోషించి, రక్షించు తల్లులు పిల్లల చంక నిడి యుద్ధరంగమున వైరుల శిరసులను బంతులాట నాడుదురా ! తల్లీ ! ఎంతలో ఎంత మార్పు ! '

రాణీ శారదాదేవి రాజభవన ప్రాంగణంలో నిలబడి. శత్రువులను చూస్తూ కంట కన్నీరు కారుస్తూంది.

తన ప్రాణాలను తన దేశానికై, తన ప్రజలకై బలి చేయడాని కెన్నడూ వెనుకంజ వేయని వీరమాత. కాని తన ప్రజలు నిష్కారణముగా శత్రుస్వార్థాన్ని నిర్మూలించడానికి యుద్ధహోమంలో ఆజ్యం అయిపోతారు కదా అని కనకన లాడి కన్నీరు కారుస్తూంది.

అంతలో—

పరుగు పరుగున ఒక భటుడు శారదాదేవి దగ్గరకు వచ్చాడు.

' ఏం ? '

' ఆక్రమణ ఆక్రమణ. '

' భయపడకండీ...దళాలను సిద్ధం చెయ్యమను. '

' రాజుగారు లేరు. '

' రాణీగారున్నారు...కన్ను తెరచిన పసికందు యువ రాజున్నాడు...ప్రజలున్నారు... '

' అమ్మా ! '

'మారాడక రణభేరి మ్రోయించండి.'

'చిత్తం.'

వెంటనే—

శత్రుహృదయ నిర్భేదంగా నగారి మ్రోయించారు. రణభేరి దశదిశల మారుమ్రోగునట్లు మ్రోయించారు.

ప్రజలలో కల్లోలం.

కూడలి దగ్గరున్న మఱ్ఱిచెట్లక్రింద గుంపులు గుంపులుగా ప్రజలు గుమిగూడారు. విషయాలు విమర్శించు కుంటున్నారు.

అందులో ఒక నవనాగరకుడు మెట్టవేదాంతి లేచి ఇలా మాట్లాడాడు.

'మిత్రులారా!

జగత్తు మిథ్య. జీవితం మిథ్య. జీవితం క్షణభంగురం. బుద్బుద ప్రాయం. ప్రపంచం అంతా మాయ. ఒక కల. ఈబ్రతుకు దానిలో ఒకవల. ఏక్షణాన కన్నుమూసి ఈబ్రతుకు కాలగర్భంలో కలిసిపోతుందో చెప్పలేం.

ఈ జీవితానికి ఆది మధ్యాలు మిథ్య. అందుచేత ఈ బ్రతికిన నాలుగునాళ్ళు సుఖంగా బ్రతకక, వెఱ్ఱిమొఱ్ఱి వేదాంతములో వేదన చెందరాదు. అరచేతిలో చందమామను పెట్టుకొని రాబోయే చీకటికి కలతచెందరాదు.

ఈ మూడునాళ్ళ జీవిత నాటకంలో విషాద ఘట్టాలెందుకు? విదగ్ధ హృదయాలెందుకు?

రాజ్యంగాని, రాజ్య సంపదలుగాని, కీర్తి అపకీర్తులు గాని మనతో రావు. మట్టి మట్టిలో కలిసిపోతుంది అంతే. రాజాధిరాజులు, మహా కవిరాజులు అంతా నోటమట్టి కొట్టు కొని పోవలసిందే.

ఇటువంటి తుచ్ఛజీవితానికై వెతచెందడం ఎందుకు ? బ్రతికున్న నాలుగునాళ్ళు భార్యాబిడ్డలతో, వస్తువాహనా లతో, సిరిసంపదలతో ఆనందంగా బ్రతికక 'నా దేశం ; నా ప్రజలు ; నా మతం ; నా సంఘం ' అని స్వార్థ బుద్ధితో బాధపడడం ఎందుకు ?

ఈ రాజ్యం ఒకరిది కాదు. రాజ్యం వీరభోజ్యం. వీరు లని పించుకొనేవాళ్ళు యుద్ధాలు చేస్తారు ; చస్తారు. మన కెందుకు ? రాజ్యాన్ని ఎవరు పాలిస్తే మనకేం ? శత్రువులైతేనే? మిత్రులైతేనే ? మహాత్ములకు శత్రువులని మిత్రులని విభేదం ఉండరాదు. సర్వమానవులు ఒకటే.

అందుచేత యుద్ధాగ్నిజ్వాలలలో ఆహుతి అయిపోవడం ఎందుకు ? దేశభక్తికొరకంటూరా చాలా పొరపాటు. రక్తి లేనిభక్తి ముక్తి దూరం ; శక్తి నిహీనం.

కాబట్టి ఈ మూడునాళ్ళ బ్రతుకుకు రాజకీయాలగొడవ లెందుకు ? ఉన్నా నాలుగు రోజులూ హాయిగా సుఖంగా బ్రతకండి. చేతులారా కష్టాలు తెచ్చి పెట్టుకోకండి ' అని ఒక డుపన్యసించి కూర్చున్నాడు. అంతా చప్పట్లు చరిచారు. అతడొక మహా యుగపురుషునిలా కూర్చున్నాడు.

అంతలో—

నెమ్మదిగా వీరమల్లుడు లేచి వాళ్ళను తప్పించుకొని ఆ మఱ్ఱిచెట్టు గద్దె నెక్కాడు. అక్కడనుంచి అతి తీవ్రంగా, గంభీరంగా, విజ్ఞానప్రదంగా, ఉత్తేజంగా ఇలా ఉపన్యసించాడు.

'మిత్రులారా !

జీవితం మిథ్య. సృష్టి మిథ్య. మట్టి మట్టిలో కలిసి పోతుంది. కాదనను. అందుచేతే బ్రతికిన నాలుగు రోజులూ పిరికిపందలా బ్రతకక మహావీరుల్లా బ్రతకమంటున్నాను.

బ్రతికున్న నాలుగురోజులూ సుఖంగా ఉండాలన్నారు. తప్పక ఉండాలి. వద్దనేవారు లేరు. కాని సుఖం క్షణ క్షణం మృత్యువుకు భయపడే పిరికి వానికి ఉండదు. వాని కుండేది ఒక్కటే—అదే ప్రాణ భయం.

శత్రు మిత్రులనే భేదం మహాత్ములకు ఉండదన్నారు. ఒప్పుకుంటాను. కాని పరదేశీయులు వచ్చి మీపై ఆధారపడి యున్న మీ పిల్లల కుత్తుకలు కత్తులతో కోస్తుంటే, మీ భార్యలను మీ ముందు పరాభవం చేస్తుంటే, 'శత్రులు మిత్రులనే భేదం ఉండరాదు' అని ఊరుకొనడం ఉత్తమలక్షణమా ? తరువాత ఆ కత్తులు మీ కుత్తుకలపై శివతాండవం చేయిస్తుంటే 'జీవితం మిథ్య ; జగత్తు మిథ్య' అని కళ్ళు మూసుకుని కబుర్లు చెప్పటం మానవ ధర్మమా ?

రాజ్యం వీరభోజ్యమే. కాదని ఎవరన్నారు ? కాని వీరులెవరో ఎక్కడో ఉన్నారనుకోనడం పొరపాటు కాదా ? వీరులుకాని వీరికి పందలకీ భారత దేశంలో స్థానం ఉన్నదా ?

ఏ రాజైతేనేం అన్నారు. అది చాలా పొరపాటు. మనరాజైతే మనదేశభాషలు, మన దేశవేషాలు, మన నాగరకత కాపాడతాడు. పరదేశ ప్రభువైతే ఆ దేశపు వేషభాషలు మనపై బలవంతంగా ముద్రవేస్తాడు. ఏ దేశభాష వేషాలైతేనే ? అంటారేమో ! పరదేశాలైన పశ్చిమ దేశాలకు భౌతికాభివృద్ధి ప్రధానం. మనకో ఆధ్యాత్మికాభివృద్ధి ప్రధానం.

వారు పూర్వోత్తర జన్మలు నమ్మరు. మనం నమ్ముతాం. వారికి భగవానుని యందు విశ్వాసంలేదు. మనకున్నది. బ్రతికి ఉండడమే వారికి పరమావధి. మనకు ధర్మయుతంగా, సత్య సమ్మతంగా బ్రతికి ఉండడమే మన పరమావధి. ఇతరులకు బలిగోనడం వారికి వాంఛనీయం. సత్యానికి మనం బలి అవడం మన వాంఛనీయం.

ఇలా వారి దృక్పథానికి మన దృక్పథానికి ఎట్టి సంబంధం లేదు. అటువంటి పాశ్చాత్యులకు స్థానం ఇవ్వడం మన తలలకు మనం కొరవులు అంటించు కోనడమే.

మిత్రులారా !

సుఖం కావాలి_సుఖం కావాలి అని ఎలుగెత్తి ఎంత ఏడ్చినా ప్రయోజనం ఏముంది ?, స్వతంత్ర దేశంలో సుఖానికి అర్హత ఉంటుంది కాని పరదేశప్రభుత్వంలో ఉండదు.

స్వతంత్రం కంటే స్వర్గం, బానిసత్వం కంటే నరకం మరొకటి లేదు. స్వదేశాభిమానం, స్వమతాభిమానం, స్వప్రజాభిమానం ప్రతివ్యక్తికీ అవసరం. ప్రజాభిమానంలేని వ్యక్తి కంటే పాషండు డుండడు. మనిషిలోని ప్రతిరక్తాణువు ప్రజల కొరకు బలిసేయడం కంటే ఆనందం ఉండరాదు. చావుకు భయపడి—'రాజెవరైతేనేం? దేశం ఏమైతే నేం? బ్రతికి ఉన్నా నాలుగురోజులూ సుఖంగా బ్రతకాలి' అనే వెర్రి వేదాంతం ప్రారంభించకండి. లేవండి. నడుం కట్టండి. యుద్ధ రంగంలోకి ఉరకండి. శత్రు మారణ హోమం చెయ్యండి. శత్రులకు వెన్నిచ్చి పారిపోకండి—'ఇది నాదేశం' 'నాదేశానికి నేను బలికావాలి' 'నాప్రజలకు నేను బలికావాలి' అనే పవిత్ర భావాలు విడిచిపెట్టకండి. లేవండి. జై భరత మాతకు జై జై భరత వీర ధీర శూర కుమార కిశోరములకు జై' అంటుంటే ప్రజలంతా జయ జయ ధ్వానాలు చేత మిన్నులు ముట్టించారు. అంతా అత్యుత్సాహ భరితులయ్యారు. యుద్ధాగ్ని జ్వాలలకు ఆహుతి అయిపోవడానికి సిద్ధమయ్యారు.

అంతలో వారిసందరినీ తోసుకుంటూ ముసాదు కాళ్ళు ముదుసలి వణుకుతూ మఱ్ఱిచెట్టుకింద గద్దెపై నిలబడింది. ఇలా ప్రారంభించింది.

'శత్రువులు దేశాన్ని ముట్టడించారంటే మన కొంపలకు నిప్పు ముట్టుకొన్నట్లే. దాస్యంచేసి బ్రతికే దానికంటే

నాశనం మేలు. మీ కళ్ళముందు మీ స్త్రీలను అగౌరవపరుస్తుంటే మీరెలా చూచి బ్రతక గలరు? ఆజన్మపర్యంతం ఒకని చేతిక్రింద బ్రతికేదానికంటే కత్తికి మన కుత్తుకలను బలిచేస్తే నష్టం ఏముంది? తొంభై ఏండ్లు దాటిన ముదుకాళ్ళ ముదుసలి. నా జీవితంలో ఎన్నడూ శత్రురాజు మన సింహాసనం ఎక్కి పాలించడం చూడలేదు. చూచే దుస్థితి కలిగితే బ్రతకలేను కూడాను. నా బిడ్డల నందరినీ యుద్ధానికి పంపుతున్నా. నేనూ వస్తున్నా భయపడకండి. ఇది 'నా దేశం' అని మరచి పోకండి. లేవండి.'

ఆమె 'లేవండి' అని ఉద్రేకంతో అంటూంటే అంతా 'లేవండీ—పదండీ—జై భరతమాతకు జై' అంటూ వీర సింహాల్లా బయలుదేరారు భూమి కదిలిపోతున్నట్లుంది—

జయ జయ ధ్వానాలు మిన్నులు ముట్టుతున్నాయి. వీరి సంరంభం అంతా దూరాన్నుంచి చూస్తున్న రాణీశారదాదేవి శరీరం ఉప్పొంగిపోయింది. అంతా యుద్ధానికి సంసిద్ధులయ్యారు.

—

## II

శత్రు భయంకర సైన్యం రాజ్యంయొక్క పొలిమేరలోకి వచ్చింది. రాణీ శారదాదేవి సైన్యాన్ని నడుపుతూ ఉంది. రెండు సైన్యాలూ పగలు పగలంతా మహాఘోరంగా

యుద్ధం సలుపుతున్నాయ్. వీనుగుల వోగులపైనుంచే గుఱ్ఱపు దళం పరుగు పెడుతూంది.

సూర్యాస్తమయం అయ్యేవరకూ యుద్ధం అతిభయానకంగా జరిగింది. సూర్యాస్తమయంతో ఆగిపోయింది.

అలసిపోయిన రాణీ శారదాదేవిగారి గుఱ్ఱం నురగలు కక్కుతూ గుడారం చేరింది. శారదాదేవి తలకొక తీవ్రమైన గాయం తగిలింది. కారే నెత్తురు నాపుచేయడానికి ఆకు పసరలు వేసి కట్టుకట్టారు.

ఒక్క రోజులోనే వేలకొలది ప్రజలు ఆహుతి అయిపోయినందుకు శారదాదేవి చాలా విచారిస్తూంది.

అంతలో వీరమల్లు డామెవద్దకు పరుగు పరుగునా వచ్చాడు.

'అమ్మా! నమస్కారం.'

'వీరమల్లూ! శత్రుసమాచారం ఏమైనా తెలిసిందా?'

'తెలిసింది తల్లీ!'

'ఏమిటి?'

'వారే అర్ధరాత్రి నదిదాటి అకస్మాత్తుగా మనపై దండెత్తనున్నారట.'

'అది యుద్ధధర్మం కాదే.'

'నిష్కారణంగా మనప్రజల నెత్తురు వరదలుగా ప్రవహింపజేసే పాపులకు ధర్మం కూడనా తల్లీ!'

'వీరమల్లూ ! వారు అధర్మపరులైతే వారికి అపజయం తప్పదు. ధర్మానికి ఎన్నటికీ జయమే.'

'ఇంకా 'అధర్మ పరులైతే' అంటారే తల్లీ ! అధర్మ పరులు కాక ధర్మపరులైతే అన్యాయంగా మన రాజ్యాన్ని ఆక్రమిస్తారా ?'

'అలాగే.'

'ఈ రాత్రి వారు మనపై దండెత్తే ముందు మనమే వారిపై దండెత్తాలి.'

'వీరమల్లూ ! అధర్మానికి నా మనసు ఒప్పడంలేదు.'

'అర్ధరాత్రి అయినా శత్రువధ చేయవచ్చునని యుద్ధ నీతి ఉన్నదమ్మా !'

'......... ...'

'మాకు సెలవిస్తే.'

'ఆలోచించి ఏపని అయినా చెయ్యండి.'

'మంచిది.'

వీరమల్లుడు బయలుదేరాడు.

* * * *

శత్రురాజు ఫిలిప్ తన సైన్యాధిపతితోను, కొందరు సైనికులతోను ఆ అర్ధరాత్రి మహాసాహసంతో నదిని దాటు తున్నాడు. ఆకాశంనిండా పరుగెత్తే మబ్బులు ; మెరిసే మెరు పులు ; కురిసే ఉరుములు అతి భయానకంగా ఉంది. అయి నప్పటికి శత్రువులు మైమరచి ఉంటారని, శత్రువధ అప్పుడు వీలనీ బయలుదేరాడతి ధీమాగా.

ఫిలిప్ : వీరో! జయం మనదే అంటావా ?'

సైన్యాధిపతి : 'తప్పక.'

ఫిలిప్ : 'హిందువులు చాలా పౌరుషశాలు రంటారే.'

సైన్యాధిపతి : 'హిందువులు పౌరుష శాలులే. కాని వారిలో వారికి ఐకమత్యం లేదు. సంఘీభావం పూజ్యం.'

ఫిలిప్ : 'అవునవును. వారిలోనే సంఘీభావం ఉంటే, వారికే స్వతంత్ర వాంఛ ఉంటే, వారికే దేశభక్తి ఉంటే, 'ఇది నాదేశం—' దీనిగురించి ప్రాణాలైనా విడిచి పెట్టాలి—అనే ఆశయమే వారికుంటే వారిని జయించ గల వీరులీ ప్రపంచంలో ఎవరున్నారు ?'

సైన్యాధిపతి : 'ఎవ్వరూలేరు. భారతీయులు మహావీరులు. శత్రువులకు భయపడేవారుకారు. తుదకు మృత్యువుకు కూడా భయపడరు. కాని వారిలో వారికి ఏమాట పట్టింపోవచ్చి వేరైపోయే తెలివి తక్కువతనం ఉంది. అంతేకాదు మతకలహాలు వారికి మిక్కుటం.'

ఫిలిప్ : 'అదే. వారిలో అటువంటి కలహాలు నెలకొల్ప డానికే ప్రయత్నించాలి.'

సైన్యాధిపతి : 'వారిలో ఒకరొకరు పోరాడుకొని శత్రుపక్షం జేరేవారు కూడా ఉన్నారు.'

ఫిలిప్ : 'మనకెవరైనా ఉంటే...'

సైన్యాధిపతి : 'ఉండకేమా తారు. మతంపేరు చెబుతేచాలు వారు మంత్రించిన మహాసర్పాలులా తలలు వంచి వేస్తారు.'

ఫిలిప్ : ' అయితే మన ఈ సాధువేషాలు వారిని మోసగించ గలవన్న మాట ! '

సైన్యాధిపతి : ' తప్పక సాధువులన్నా, సన్యాసులన్నా వారికి భక్తి ఎక్కువ. అందుచేతే ఇండియానిండా గుడులు ; మఠాలు. భారతదేశం బంగారానికి నిలయం ; పాడి పంటలకు ఆలవాలమేమో—ప్రజలు మితిమీరిన సంప దలతో మత్తెక్కి—ఉక్కొ పీలున్నూ, ' భక్తి ' అనే మాసుగులో లోమాకులై నిదరపోతున్నారు. '

ఫిలిప్ : రాణీ శారదాదేవితో కలహించి ఎవరైనా మనపక్షం వచ్చి వారిగుట్టు బయలు పెడితే బాగుండును. '

సైన్యాధిపతి : ' ఒకరు రావడం ఏమిటి ? మనం రప్పించాలి .'

ఫిలిప్ : ' రప్పించగల మాటావా ? '

సైన్యాధిపతి : ' తప్పక. '

వారలా మాట్లాడుకుంటూ వెళుతున్నారు. నది దాట నున్నారు. అంతా సాధువుల వేషాలలో ఉన్నారు.

అంతలో వారికి ఎదుటిగా ఒక చిన్నదోనె వస్తూంది. దానిపై నలుగురు పల్లెవాళ్ళు ఉన్నారు. చేపలు పట్టు కుంటూన్నారు.

వీరో ఫిలిప్పులు చూశారు.

ఫిలిప్ : ' ఎవరువారు ? '

సైన్యాధిపతి : ' చేపలు పట్టుకొనేవాళ్ళు. '

ఫిలిప్ : ' కొంపతీసి శత్రువులు కారుకదా ? '

సైన్యాధిపతి : 'శత్రువులైతే నలుగురే. రావడానికి గుండా చెరువా ? పైగా మనకు తెలిసినట్లుగా మారువేషాలు వేసుకొని శత్రువులను వంచించడం వారికేం తెలుసు ? వారు పట్టి అమాయకులు. ఆవులమందవంటివారు. ఒక్క తోడేలుచాలు వారిని చెల్లా చెదురు చేయడానికి.'

ఫిలిప్ : 'వీరెవరో అడిగితే.'

సైన్యాధిపతి : 'ఎందుకండీ—చేపలవాడినీ అడిగి, చెంచు వాడినీ అడిగితే మనకేమైనా యదార్థం తెలుస్తుందా ? వాళ్ళకీ రాజులకూ సంబంధం ఏమిటి ?'

గురువు : 'వీరో ! పొరపడుతున్నావ్. ప్రతి దేశంలోనూ నాటికి ఒక్కడైనా మహావీరుడు జన్మించడనుకోకు. అటువంటి మహావీరులకు చెందిన వాళ్ళానలుగురూ అని అనుకోవడం పొరపాటుకాదు. ఎప్పుట్లలో ఏపాము ఉంటుందో చెప్పలేం. ఇది భరతదేశం అని మరచిపోకు యుద్ధరంగంలో ప్రతి ఇసుకరేణువుపై నా భరతవీరుని ఒక్కొక్క నెత్తుటిబొట్టయినా ముద్ర వేయబడిందనుకో. భరతదేశంలో పుట్టిన ప్రతి పసికూనకు తమ తల్లులు పాలలో పౌరుషపురసం రంగరించి పడతారని జ్ఞప్తికి తెచ్చుకో—ఇది వీరులకు నిలయం కాని పిరికి పందలకు నిలయం కాదు.'

గురువు గారలా చెబుతుంటే ఫిలిప్ రాజు ఉలుకులికి పడ్డాడు. వీరో భరతదేశ పౌరుషాన్ని విని సహించలేక అత్యుగ్రుడై పోయాడు.

సైన్యాధిపతి : 'గురూజీ! పిల్లిపిల్లలను సింహాపు పిల్లలచేసి మాట్లాడుతున్నారు. భారతీయులు పౌరుషవంతులే కావచ్చు; యుద్ధనైపుణి వారికి లేదని మరచిపోకండి. గొఱ్ఱె మందలెన్నైతేనేం? ఒక సింహాపు గర్జన వాటి నన్నిటినీ బెదర గొట్టడానికి చాలునని మరచిపోకండి. మన జీవితరంగమే రణరంగం—వారిదో...'

వీరో అతి ఆవేశపూరితంగా నవ్వడం ప్రారంభించాడు. దానితో గురువుగారి కన్నులెఱ్ఱబడ్డాయ్. తన పెద్ద తెల్లని గడ్డం వేళ్ళతో సవరించుకుంటూ, లేచినిలబడి మహాగంభీరంగా కనుబొమలు ముడివైచి ఇలా ప్రారంభించాడు.

గురువు : 'వీరో! పిల్లకాకికి ఉండేలుదెబ్బ తెలీదు. గుడ్డి కొంగకు కత్తిపెట్టు తెలీదు. భారతీయులు గొఱ్ఱె మందలు కారు; కొదమ సింహాపు పిల్లలు. భారత దేశాన్ని జయిస్తే ప్రపంచాన్ని జయించినట్లే. యుద్ధ నైపుణి తెలియదన్నావ్ అది కేవలం కన్నుమూసు కొని అన్నామాట. కన్నుతెరువ్. కత్తిమొన జాగే నెత్తుటిబొట్లు కనబడతాయ్... వారి సిరస్సులపై నడిచి వెడితేనేకాని వారి రత్నమయ సింహాసనాన్ని ముట్ట లేవ్... వారి సింహాసనాన్నే ఆక్రమించడం వస్తే,

రాజ్యంలో ఒక్కడు బ్రతికి ఉండడుసుమా! భారత భూమి; వీరభూమి. మరచిపోకు. జాగ్రత.'

ఆమాటలంటూ కోపంతోటి బాధతోటి గురువుగారు లేచి వెళ్ళిపోయారు. రాజు గడగడలాడిపోయాడు.

ఫిలిప్ : 'వీరో! గురువుగారికి కోపం వచ్చింది.

సైన్యాధిపతి : 'ఆ పల్లెవాళ్ళను చూచి వేషగాళ్ళంటాడు; ఆయనకేమైనా మతిఉందా?'

ఫిలిప్ : 'పోనీ వాళ్ళ విషయం పరిశీలించి చూడరాదూ?'

సైన్యాధిపతి : 'అబ్బా! మీకూ అనుమానమే. అయితే వాళ్ళ విషయాలు మూడునిముషాల్లో కనుక్కుంటా చూడండి.'

ఆ మాటలంటూనే నావికునకు సైగచేయగా నావికుడు ఆ పల్లెవాళ్ళ వైపునకు పోనిచ్చాడు.

వాళ్ళూ వీళ్ళూ కలుసుకున్నారు.

వెంటనే ఫిలిప్ రాజుసైన్యం కొందరు వారిని తమ పడవలోకి రమ్మనగా వారు ఫిలిప్ రాజు పడవలోకి ఎక్కారు. ఆ నలుగురూ వీరో ముందు వణికిపోతూ కూర్చున్నారు.

వీరో : 'మీ రెవరోయ్.'

పల్లెవాడు : 'సాధువులు త్రికాలజ్ఞులుకదా మహాశయా!'

వీరో : 'అవును.'

పల్లెవాడు : 'అయినప్పుడు తమకు తెలియకుండా ఉంటుందా?

మేమెవరమో మేం చెప్పకుండానే తమరు గ్రహించాలి కదండీ !'

వీరో : 'అయితే గ్రహించాం ; మీరు మారువేషగాళ్ళు, శారదారాణి భటులు.'

పల్లెవాడు : 'ఎంత ఆశ్చర్యం ! సాధువులంటే ఎంత శక్తిగల వారు. నిజమైన సాధువులంటే మీరు. ఉన్నది ఉన్నట్లు చెప్పగలిగారు.'

వీరో : 'ఏమిటి ? మీరు వేషగాళ్ళే !'

పల్లెవాడు : 'ఎందుకు బాబూ ఆశ్చర్యం ! మీరు ఊహించి చెప్పడం, అది కాకుండా పోవడం కూడానా ? మా దేశానికి ఎంతమందో దొంగసాధువులు వస్తుంటారు ; వారు మీలా చెప్పగలరా ? జరిగింది, జరుగుతుంది, జరుగబోయేది చెప్పగల ప్రజ్ఞానిధులు మీరు ; మీకూ దొంగ సాధువులకు సంబంధంఏమిటి ?'

ఫిలిప్ : 'మీరు రాణీ శారదాదేవిగారి భటులేనా ?'

పల్లెవాడు : 'కాదని అబద్ధ ఆడితే మాత్రం చెల్లుతుందా మహాత్మా ! మీ దగ్గర అబద్ధాలు చెప్పగలవ్యక్తి ఈప్రపంచంలో బ్రతికి ఉండగలడా ? అతని మొుఖాన తల నిలబడగలదా ?'

వీరో : 'బాగా చెప్పావ్...మా విషయం బాగా గ్రహించావ్'

పల్లెవాడు : 'చిత్తం. చిత్తం. మీ విషయం పూర్తిగా గ్రహించామండి. అందుచేతే ఉన్నది ఉన్నట్లుగా చెప్పేశాం.'

వీరో : 'మీరీ మారు వేషాలు వేయడానికి కారణం ?'

పల్లెవాడు : 'ఇలా మారు వేషాలే వేయకపోతే కోటదాటి బయటకు పోనిస్తారా రాజభటులు ?'

ఫిలిప్ : 'ఎక్కడకు వెడుతున్నారు ?'

పల్లెవాళ్ళు : 'చెప్పకపోవడం ఎందుకు—మా శత్రురాజైన ఫిలిప్ దగ్గరకు ?'

ఫిలిప్ : 'ఎందుకు ?'

పల్లెవాడు : 'ఆయన పాదాలపై పడి శరణువేడాలని బయలు దేరాం.'

వీరో : 'శరణా ? ఎందుకు—మీ కేఉద్యోగం.'

పల్లెవాడు : 'ఫిలిప్ రాజుగారితో చెప్పి సహాయంచేయిస్తా నంటే ఉన్నా విషయం అంతా చెబుతాం.'

ఫిలిప్ : 'తప్పక సాయంచేయిస్తాం. త్వరగా చెప్పు.'

పల్లెవాడు : 'అయ్యా ! నా పేరు వీరమల్లుడు. సర్వసేనాధి పతిని. వీరు మాసామంత దండనాయకులు. ఫిలిప్ రాజుగారితో సంధిచేసుకోమని రాణీ శారదాదేవి గారిని కోరాం. ఆమె ఒప్పుకోలేదు. యుద్ధంలో ప్రజలు లక్షలు లక్షలుగా చనిపోతున్నారు. వారి మరణం చూచి సహించలేక ఫిలిప్ రాజును శరణు వేడాలని బయలు దేరాం. ఆయన మమ్మల్ని అను గ్రహించి శరణిస్తాడా సరేసరి ; లేకపోతే వారి కత్తికి మాకుత్తుకలను అంకితం చేస్తాం.'

ఫిలిప్ : ' శభాష్ ! మీ ప్రజాభిమానానికి చాలా సంతో
షించాం. అయితే వీరమల్లూ నీకు కావలసిందేమిటి?'

వీరమల్లుడు : ' ఏముంది ?...'

ఫిలిప్ : ' భయపడకు—నీవు కోరినవన్నీ ఫిలిప్‌తో క్షణాల్లో
చేయిస్తా. '

వీరమల్లుడు : ' ధన్యుడను. సాధుమహాశయా ! ప్రజా మారణ
హోమం సహించలేను. అందుచేత ఈరాత్రే ఫిలిప్
రాజుగారికి మార్గాణీగారిని ఖయిదీగా పట్టించి, ఆయన
అనుజ్ఞపై రాజై, ప్రతిసంవత్సరం కప్పం కట్టి ప్రజలను
రక్షించుకుందామని బయలుదేరాం. '

ఫిలిప్ : ' శభాష్ ! '

వీరో : ' శభాష్ ! '

వీరో ఆనందం, ఫిలిప్ ఆనందం వర్ణించలేం. కేవలం
భారతదేశ సింహాసనాన్ని పాలించినట్లే భావించి పొంగి
పోయారు.

ఫిలిప్ : ' వీరమల్లూ ! నీ కోరికలన్నీ ఫిలిప్‌రాజు తీర్చగలడు.
ఆయన ఈపడవలోనే ఇచ్చటే ఉన్నాడు. '

వీరమల్లుడు : ' ఆమహానుభావుని సందర్శించగల భాగ్యం
నాకు లభింపజేయరా ? '

ఫిలిప్ : ' వారే వీరు...ఇతడే మాసైన్యాధిపతి వీరో......
నీ కిప్పుడే పట్టాభిషేకం చేసేస్తాం. రాణీని పట్టుకొనే
మార్గం చెప్పు. '

వీరమల్లుడు : ' తక్షణం చెబుతాను. మేమామెతో ఈవిధంగా పల్లెవాళ్ళవేషంలో వెళ్ళి మిమ్ములను పట్టుకొని తీసుకు వస్తామని ప్రతిజ్ఞ చేశాం. మీకు అనుమానం కలగ కుండా ఉండాలని ఆమె నీ నదీతీరం దగ్గర శిబిరంలో ఉండమని సలహా ఇచ్చాం. ఆమె అలాగే ఒప్పుకొని ఆ కనబడే డేరాలలోనే ఒంటరిగా ఉంది.

వీరో : ఐతే ఆమెను క్షణంలో పట్టుకొని ఖైదీ చేయవచ్చును.

వీరమల్లుడు : అదేగా నేనుచెప్పేది. కాని ఆమెను పట్టు కొన్నాతరువాత నన్ను రాజును చేస్తానని ప్రమాణం చెయ్యాలి.

ఫిలిప్ : ఒకప్రమాణం ఏమిటి ? లక్షప్రమాణాలు చేస్తాం.

వీరమల్లుడు : అయితే పదండి. మీరంతావస్తే వారు అను మానంపడి సైన్యసమేతంగా యుద్ధానికి సిద్ధం అవుతా రేమో...

ఫిలిప్ : అరే మనం అంతా ఎందుకోయ్. ఒక్కఆడదానిని పట్టుకుంటానికి మే మిద్దరం చాలం ?

వీరమల్లుడు : ఎక్కువ.

వీరో : పదండోయ్. వందమందికైనా జవాబు చెప్పగల వీరో మీా పక్కనుంటే భయం ఏముంది ? భయపడక భయపడక భారతీయులకు కూడా భయపడాలి ?

ఫిలిప్ : శభాష్—పదండి...

వీరమల్లుడు వారిని రాణీగారున్నారని చెప్పిన శిబిరం వైపునకు తీసుకువెళుతున్నాడు.

—

# III

అది అతి ప్రశాంత నిశాసమయం. చీకటిలో నదీ తరంగాలు భైరవ తాండవం జేస్తున్నాయ్. శారదాదేవిగారి శిబిరం కాళి విరియబూసుకొన్న తలలాగుంది.

వీరమల్లుడు, తన అనుచరులు, ఫిలిప్, వీరో రాణీ శారదాదేవిగారి శిబిరం వైపు వెళ్ళుతున్నారు.

అది శిబిరం.

పదిమంది రాజభటులు కాపలా కాస్తున్నారు. వారిని చూసి ఫిలిప్ హడలి పోయాడు.

ఫిలిప్ : వీరసింహా ! చాలామంది ఉన్నారే.

వీరమల్లుడు : భయపడకండి. క్షణంలో వారు తప్పుకొనేటట్లు చేస్తాను.

ఫిలిప్ : నీవు ముందువెళ్ళి వారికేమైనా ఆశపెట్టి తప్పుకొనేటట్లు చెయ్.

వీరో : అంతే. తిరువాత రాణీగారి పని నేపడతాగా.

ఫిలిప్ : వద్దు. వద్దు. రాణీగారి పని నే పడతా, నీవు దాసీ పని పట్టు.

వీరో : అలాగే...అలాగే.

వీరమల్లుడు : మీరు నిమ్మళంగా మావెనుకే రండి.

వీరో : 'అలాగే.. పద...పద.'

వీరమల్లుడు డేరాదగ్గరకు వెళ్ళి కాపలాకాసేవాళ్ళతో ఏమిచెప్పాడో ఏమిటో వారు తప్పుకు వెళ్ళిపోయారు.

ఫిలిప్ : వీరోలవంక చూచి రమ్మని సైగచేశాడు. ఫిలిప్ వీరోలు అతనివంక చూస్తూ అడుగులో అడుగులు వేసుకుంటూ నెమ్మదిగా వెళ్ళారు.

వీరమల్లుడు : 'ఇదే సమయం. లోపల రాణీగారు నిదర పోతున్నారు. ఇద్దరు దాసీలు కాపలా కాస్తున్నారు. ఒకరు రాణీగారిని బంధించండి. మరొకరు నాతో కలిసి దాసీలను బంధించండి—'

ఫిలిప్ : 'అలాగే...పద...పద.'

ఆ నలుగురూ కలిసి లోపలకు వెళ్తున్నారు.

ఫిలిప్ : (నెమ్మదిగా వీరోతో) రాణీ నిదరపోతూంది. నీవు దాసీలను బంధించు.

వీరో : 'అలాగే.'

వీరమల్లుడు : 'రాజుగారూ! మొదట వెలిగే ఆ కాగడా ఆరిపేయండి. చీకటిలో పని తేలిగ్గా అవుతుంది.'

ఆ మాట కతడు ఒప్పుకున్నాడు. వీరో కాగడా ఆరిపి వేశాడు. అమాంతంగా ఫిలిప్ రాణీపై పడ్డాడు. అంతే వీపు మీాద పెద్దగుద్దు. రాణీవేషం వేసుకొన్న ప్రతాపుడతని గొంతు పట్టి నులుపినులిపి పారవేశాడు. దాసీలవేషాలు వేసుకొన్న వారు వీరమల్లుడు బొయికలు విరగకొట్టారు.

అంతలో వీరమల్లుడు కాగడాతో లోపలికి వచ్చాడు. వారు ఫిలిప్ రాజునూ, వీరోనూ తాళ్ళతో కట్టి బంధించారు.

ఫిలిప్ : 'వీరమల్! నమ్మించి స్వామిద్రోహం చేస్తావా?'

వీరమల్లు : ' స్వామి ఎవ్వరామూర్ఖా ! సాధువులు వేషాలు వేసుకొని మమ్మల్ని మోసం చెయ్యాలనుకో లేదు. '

ఫిలిప్ : మేం రాజులం. అది రాజనీతి.

వీరమల్లుడు : మేం రాజాధిరాజులం. ఇది మహారాజనీతి. '

వీరో : ' ఒరేయ్ ! రాజద్రోహీ ! ఇప్పుడు మమ్ములను బంధించగలిగానని సంతోషించకు. ఈ సంగతి మా సైన్యానికి తెలిసి తెల్లవారులోపున నీ కుత్తుక ఖండించి మా శిబిరంపై కట్టకుంటా ఉంటారనుకో. '

వీరమల్లుడు : (నవ్వుతూ) మీ శిరసులు మీ మొండాలపై తెల్లవారు వరకూ ఉంటే తరువాత చూడవచ్చును లేవోయ్ పక్షీ ! మీ తలలు ఈ మొలుకు తగిలించి తెల్లవారుసరికి కోటగుమ్మానికి వేలాడవేయండి...

ఫిలిప్ : (వణుకుతూ) ' వీరమల్లూ ! బుద్ధి గడ్డితిని యుద్ధానికి బయలుదేరాం. తప్పని ఒప్పుకుంటున్నాం. శరణంటే శత్రువులనైనా రక్షించడం భారతీయుల ధర్మంకదా ! మేం శరణంటున్నాం. తప్పని ఒప్పుకుంటున్నాం. కాబట్టి రక్షించాలని ప్రార్థన. '

వీరో : ' అంతే, అంతే. '

వీరమల్లుడు : 'పిరికిపందలు, జీవచ్ఛవాలు అయిన మీ వంటి పీనుగుల కుత్తుకల తెగనరికే మా కత్తులైనా సిగ్గుపడుతున్నాయ్ కాని మీకు సిగ్గులేదు... మీరు మానవులుగా పుట్టినందుకు మానవ లోకమే కళంకితమైపో

యింది. మీరు పుట్టిన దేశమే పౌరుషవిహీనం అయి పోయింది. మీ ముఖాలు చూస్తున్న మా కళ్ళే పాప భూయిష్టం అయిపోతున్నాయ్.

ఒరేయ్ ! రామూ ! వీళ్ళనిద్దరినీ కట్టి గాడిదలమీద వేసి రాణీగారి దగ్గరకు తీసుకురండి. ఆమె ఆజ్ఞ తీసుకొని వీళ్ళ శిరచ్ఛేదం చేయించాలి. ?

ఆ మాటలంటూ వీరమల్లుడు మహా పౌరుషంతో గుఱ్ఱం ఎక్కి వెళ్ళిపోయాడు రాణీ శారదా దేవిగారిదగ్గరకు.

* * * *

తెల్లవారుతూంది. బాలభాస్కరుడు తన బంగారు కిరణాలను ప్రకృతి ప్రణయసిద్ధహాస చంద్రికలలో అమర నృత్యం చేయిస్తూఉన్నాడు.

శారదాదేవి తన శిబిరంముందు అటూ ఇటూ తిరుగుతూవుంది. అంతలో గుర్రంమీదనుంచి వీరమల్లుడు దిగి ఆమెకు నమస్కరించి నిలబడ్డాడు.

రాణి : ' వీరమల్లూ ! అయ్యగారిసంగతి ఏమైనా తెలిసిందా ?'

వీరమల్లు : ' జయం లభిస్తూ ఉందంట అమ్మా ! '

రాణి : ' వీరమల్లూ ! ఇవాళ సైన్యాన్ని ఉత్సాహపరచి ముందడుగు వేయించి, జయలక్ష్మి కరగ్రహణం ఈ రోజు చేసి తీరాలి. '

వీరమల్లు : ' జయం మనకు లభించినట్లే తల్లీ! '

రాణి : ' ఎలా ? శత్రుతిరోగమనం జరగందే. '

వీరమల్లు : ' అవసరంలేదు తల్లీ! రాజే మనఖైదీ అయ్యాడు. '

రాణి : ' రాజా ? '

వీరమల్లుడు : ' రాజే కాదు ; సైన్యాధిపతికూడా మన బంధీ అయినాడు. '

రాణి : ' వారేరి ? '

వీరమల్లు : ' అదిగో...బంధికృతులై వస్తున్నారు. '

రాణి : ' ఏరీ ? '

వీరమల్లు : ' అదిగో...ఆ...'

రాణి : ' గాడిదలపై వచ్చేవారేనా ? '

వీరమల్లుడు : ' అవునుతల్లీ ! '

ఆమె ఉగ్రస్వరూపిణి అయిపోయింది. కనుబొమలు ముడివేసింది. అంతలో వారు సిద్ధం అయిపోయారు.

రాణి : ' వీరమల్లూ ! నీకు రాజభక్తి ఉన్నది. కాని ఎదటి రాజుని గౌరవించే శక్తి లేదు. దేశభక్తి ఉన్నది ; కాని పరదేశవాసులను భ్రాతృభావంతో చూడగల పరిపూర్ణ నిర్మలత్వం రాలేదు. పౌరుషం ఉన్నది ; కాని దానిని ఉపయోగించే విధానం తెలీదు. శత్రువులను కూడా మిత్రులుగా ప్రేమించగల శక్తి వచ్చే వరకు మానవులు మహాత్ములు కాలేరోయ్...తక్షణం వెళ్ళి వారిని గాడిదల మీదనుంచిదింపి గుఱ్ఱాలపై నెక్కించి తీసుకురా ! సోదర ప్రభువును గౌరవించడంలో గొప్పతనం ఉన్నది ; తిరస్కరించడంలో లేదు......వెళ్ళు. అందాక వారిని చూడలేను...'

వీరమల్లుడు : 'అమ్మా ! మనలో వెలిగే పరమాత్మజ్యోతే కుక్కలోనూ వెలుగుతుందని సింహాసనంమీద కూర్చో పెట్టగలమా ? '

రాణి : ' ఆ భావంతోటే ఉంటే కూర్చోపెట్టవచ్చు. యదార్థాని రాజ్యాన్ని పాలించేది రాజు కాడు; మీరంతా... రాజ్యం సుభిక్షంగా ఉందంటే ఆరాజ్యంలో ప్రజలు విజ్ఞానవంతులనుకో. '

వీరమల్లుడు : ' యధారాజా తథాప్రజా ' అన్న సూక్తి నే మంటారు ?

రాణి : ' తప్పంటాను. ' యధారాజా తథాప్రజా ' కాదు ; ' యథాప్రజా తథారాజా '...రాజునుబట్టి ప్రజలు కాదు ; ప్రజలబట్టేరాజు...వీరమల్లూ ! కుళ్ళిపోతున్న మురికి జీవాన్ని స్వతంత్రవాయువులతో పునీతంజేసి, ఆశాజ్యోతిని చూపించడంలో అమరత్వం ఉంటుంది కాని—దాని హృదయాన్ని చీల్చి ముక్కలు చేయడంలో లేదు. స్వతంత్రదేశాన్ని బానిసదేశం చేయడం తేలికే. బానిసదేశాన్ని స్వతంత్రదేశం చేయడమే కష్టం, ఒకనిని పతితుని చేయడం తేలికే ; పవిత్రుని చేయడం కష్టం...'

వీరమల్లూ ! వెళ్ళు ! రాజోచితగౌరవం చూపించి వారిని తీసుకురా. మారాడకు...'

వీల్లు : ' చిత్తం తల్లీ ! '

రాణీశారదాదేవి లోపలకు వెళ్ళిపోయింది. వీరమల్లుడు గాడిదలవైపు వెళ్ళి వారిని విడిపించి గుఱ్ఱాలపై ఎక్కించి అతిగౌరవంగా రాణీగారిదగ్గరకు తీసుకువెళ్ళాడు.

* * * *

ఫిలిప్ రాజూ వీరో ఏవో మాట్లాడుకున్నారు. ఫిలిప్ రాజునూ వీరోను బంధితులజేసి లోపలకు తీసుకువెళ్ళాడు వీరమల్లుడు.

రాణీగారు నిలబడ్డారు.

రాణీని చూడడం చూడడం ఫిలిప్ రాజు ఆమె రెండు కాళ్ళపైనా పడిపోయాడు.

శారదాదేవికి ఎక్కడలేని కోపంవచ్చింది—

రాణి : 'రాజుపుత్రకదా అని రాజోచితం గౌరవం ఇచ్చి తీసుకు రమ్మన్నాను. కాని ఇదేమిటి? సేవకుడుకూడా ఇంత నీచంగా సంచరించడే...... ఛా. ఛా. లే. కాళ్ళు ముట్టకు...'

ఫిలిప్ : 'మీరు లక్షతిట్టండి. చంపండి. శరణార్థిని 'రక్షించాను' అనేవరకూ మీ పాదాలు విడువను. భారతీయుల శక్తి తెలియక యుద్ధం ప్రకటించాను. బుద్ధి గడ్డితిన్నది. ఓడిపోయానని ఇప్పుడొప్పుకుంటున్నా. 'రక్షించాను' అనండి లేచిపోతా...అంత వరకు ఇంతే.

రాణి : 'రాజుగా ప్రార్థించు ; విడిచిపెడతా. ఇలా తుచ్ఛునిగా ప్రార్థిస్తే లాభం ఏమిటి ?'

ఫిలిప్ : 'మొదటే చెప్పాను—తిట్టినా, చంపినా విడిచవనని మీ చేతికి చిక్కాను. చీల్చేయండి. ఒప్పుకుంటా కాని మీ పవిత్ర పాదాలు విడువను. రక్షించాను—అని అనండి. అనండీ...అనండీ.'

ఫిలిప్ చంటిపిల్లవానిలా ఏడవడం ప్రారంభించాడు. అది చూచిన రాణీహృదయం కరుగకపోలేదు. అబలహృదయ పాత్ర అశ్రుధారా పరిపూర్ణం కావడానికి ఎంతసేపు కావాలి. వెన్న కరగడానికి నిప్పుసెగ చాలదూ ?

రాణి : 'లే రాజా ! లే ! నిన్ను క్షమించానులే. ఇప్పటికైనా భారతీయుల వీరగాథను అర్థం చేసుకో గలిగావ్. శాకుమారులు శరణార్థిని రక్షించకుండా ఉండలేరు. పవిత్ర భరతమాత అమృత స్తన్యం గ్రోలిన ఏ హైందవుడూ నైతిక పతనానికి ఒప్పుకోడు. ఎదటివాని సంరక్షణార్థం తాను బలి అవుతాడు కాని, తనకొరకు ఎదటివానిని బలిచేయలేడు.'

ఫిలిప్ : 'అవును తల్లీ ! అవును. మధ్యాహ్నపు సూర్యుని కన్నెత్తి చూడాలనుకున్నాం. అంధులంకాక ఏమౌతాం. తమరు కరుణారసపూరితులు కాబట్టే నన్ను విడిచిపెట్టారు....'

రాణి : ‘ అవును. మీరు మాటాడక మా పొలిమేరలు విడిచి పొండి. మా పొలిమేరప్రాంతంలో ఉన్నారా మీ శిరసులు ఛేదించానే. ’

ఫిలిప్ : ‘ చిత్రం. చిత్రం. మీరు మా దేవతలు. మీ మేలు మరచిపోలేను. నమస్కారం ! ’

వంగివంగి నమస్కారాలు చేస్తూ ఫిలిప్ రాజు, వీరో బయలుదేరబోయారు.

అంతలో వీరమల్లుడు అతి క్రోధోద్రిక్తుడై రెండు చేతులూ చాచి వారి నాపుచేసి రాణిగారికి నమస్కరించి ఇలా ప్రారంభించాడు.

వీరమల్లుడు : ‘ తల్లీ ! మీరు విజ్ఞానులు, ఆత్మజ్ఞానులు. భారతీయ పౌరుష రేఖలు రూపుదాల్చిన వీరమాతలు. దేశ స్వాతంత్ర్యానికై బలి అవడానికి వెనుదీయని ధీర మూర్తులు. పగతురకు వెన్నుచూపని పౌరుషశాలులు.

కాని రాజకీయ దురంధరులు కారేమో తల్లీ! పగతురను పట్టుకొన్నది విడిచిపెట్టడానికి కాదు. రణశేషం, ఋణశేషం ఉండరాదు. చెట్టునున్న పుట్ట చెట్టునే చెరుస్తుంది. నిప్పుకణం ఒక్కటైనా చాలు నగరాలు నగరాలు తగలబెడుతుంది. పగపట్టిన సర్పాన్ని విడిచిపెడితే, అది కాటువేయక మానదని మరచి పోకండి. మన ప్రజల వేడినెత్తురు రుచి మరిగిన శత్రువులకు దయా దాక్షిణ్యాలుం టాయని నమ్మకండి. మన స్వాతంత్ర్యాన్ని మట్టిపాలు చేసి, మనలను బూడిదకావించి,

మనదేశాన్ని స్థిరదాస్యంలో బలిగొనడానికి వచ్చిన శత్రువు లపై జాలేమిటి తల్లీ !

ఎంతమంది సతీపతులనో వేరుచేసిన పాతకులు : ఎందరు మహాపతివ్రతాశిరోమణులనో తమ మంగళసూత్రములకు వేరు చేసిన కిరాతకులు : ప్రతిఇంటి కన్నీటి జల్లును రాల్పించిన కాలాంతకులు ; పసిబిడ్డల కుత్తుకల తెగనరుకుటకు వెనుదీయుని రాక్షసులు ; పవిత్ర భారత దేశ రత్నసింహాసనాన్ని ఆక్రమించ తలంచిన అత్యాశాపరులు — ఈ పిశాచులనా రక్షించుట. శాంతిమయ దేశాన్ని అశాంతివంతం చేసిన ఈ స్వార్థపరుల పైనా కరుణ?

తల్లీ ! వీరిని విడిచిపెట్టవలదని మా ప్రార్థన.

రాణి : ' వీరమల్లూ ! నీవు చెప్పినవి కాదనను. నిస్సహాయు డైన శత్రువును వధించడం రాజధర్మం కాదు. రాజ్యాని కంటే ప్రధానం ధర్మం. ధర్మాచరణే మానవకర్తవ్యం. శత్రువులను సైన్య సమేతంగా రానీయ్. యుద్ధం చేసి జయించుదాం. పౌరుషవంతులమై భారత మాతను రక్షించుకుందాం...పిరికిపందలవలె కపట వ్యూహాలు మన కెందుకోయ్ వీరమల్లు ? '

వీరమల్లు : ' వారు కపట నటకులై సాధువుల వేషాలతో రాలేదా ? '

రాణి : ' వారు పిరికిపందలైతే మనమూ అవుతామా ? వారు అధర్మపరులైతే మనమూ కావాలా ? '

వీరమల్లుడు : ' వ్యావహారిక ధర్మం వేరు ; యుద్ధధర్మం వేరు తల్లీ ! ఉపపాండవులను అర్ధరాత్రి చంపిన అశ్వత్థామకు యుద్ధనీతి తెలియదంటారా ? శత్రువధ ఏవిధానంగా అయినా చేయడమే యుద్ధధర్మం. '

తల్లీ ! ఒక్కమాట. ' నా దే శ ం ' బానిసదేశం అవుతుందేమోననే భయం నాకు అపారంగా ఉంది. పరదాస్య పీడన నా భారతీయులకు మీ ఉదారస్వభావం వల్ల కలుగుతుందేమోనని నా సంశయం.

రాణి : ' పిరికితనం భారతీయులకు ఎన్నడూ లేదు ; ఇకముందు ఉండరాదు. భారతీయులకు శత్రుభయం కూడానా ? విడిచిపెట్టు వీరమల్లూ విడిచిపెట్టు — కోరలులేని సర్పాలు మనలనేం చేస్తాయ్. పడగలేని పాముకూ భయపడడమేనా ? '

వీరమల్లు : ' చిత్తం. '

వీరమల్లు వారిని విడిచిపెట్టాడు. ఫిలిప్సు వీరో ఆనందంగా బయలుదేరి వెళ్ళిపోయారు.

వీరమల్లుమాత్రం కష్టాలను శంకిస్తూ ఆలోచనలో మునిగిపోయాడు.

రాణీగారు విజయాన్ని భావిస్తూ ఆనందంగా లోపలకు వెళ్ళిపోయారు.

---

# IV

ఆ మరునాడు—

హైందవ సైన్యాధిపతి ప్రతాప్‌సింహుడు పరుగు పరుగున రాణీశారదాదేవి దగ్గరకు వచ్చాడు.

శారదాదేవి ఆశ్చర్య పోయింది.

రాణి : 'ఏం ప్రతాప్ ఇలా వచ్చావ్ ?'

ప్రతాప్ : 'ఇంకే ముందమ్మా ! కొంప మునిగిపోయింది. అది శత్రుసైన్యసమూహంకాదు. మహాప్రళయసముద్రం.'

రాణి : 'మరల దండెత్తి వస్తున్నారా ?'

ప్రతాప్ : 'దండెత్తి రావడమేకాదు; దక్షిణ గంగాతీర ప్రాంతంలో యుద్ధం చేసే మహారాజుగారిని బంధించారంట ?'

రాణి : 'ఆఁ మహారాజుగారినే బంధించారా ?'

ప్రతాప్ : 'బంధించుటే కాదు—ఉత్తర దక్షిణముల నుండి శత్రువులు కోట నాక్రమింప వస్తున్నారు. భారతీయుల నిక పట్టి, చెట్లులకు కట్టి, కాల్చివేస్తామని కబురు పంపారు.'

రాణి : 'భారతీయుల పాలిట భగవానుడున్నాడు. భగవానుడు ధర్మపక్షపాతి. భారతీయులు ధర్మాత్ములు. ధర్మాన్ని కాపాడు భగవానుడు ధర్మపక్షపాతులకు విజయం తప్పక చేకూరుస్తాడు. భయపడకు ప్రతాప్ భయపడకు. భగవానుడున్నాడు.'

ప్రతాప్ : ' లేదని ఎవడేడ్చాడమ్మా ! మనం భగవాను డున్నాడు, ఉన్నాడని పూజలో కూర్చుంటే, మన సింహాసనంమీద శత్రురాజు కూర్చుంటం తప్పదు. '

రాణి : ' భారతీయ సింహాసనాన్ని ఆక్రమించుకోనడానికి భగ వానునకు కూడా వశంకాదు. పిరికివాడవుకాక వీర మల్లుని పిలువు '

ప్రతాప్ : ' చిత్తం. '

ప్రతాప్ వెళ్ళిపోయాడు.

శారదాదేవి కవచం తొడుక్కుంది, కత్తి డాలూ చేదాల్చి, భరత మాతకు పూజ చేస్తూంది.

అంతలో వీరమల్లుడు వచ్చాడు.

రాణి : ' వీరమల్లూ ! కర్తవ్యం. '

వీరమల్లు : ' చంపటం ? లేదా చావడం అయితే ఆజన్మ స్వాతంత్రం ; లేదా ఆజన్మదాస్యం. '

రాణి : ' రాజుగారిని బంధీచేశారటే '

వీరమల్లు : ' బంధించుటే కాదు. అన్నివైపులనుంచీ ముట్ట డిస్తున్నారు. అగ్నికి వాయువు తోడయింది. '

రాణి : ' అపజయం శంకిస్తున్నావా ? '

వీరమల్లు : ' ఎన్నడూ శంకించడంలేదు. అపజయమేప్రాప్తిస్తే భారతీయుడొక్కడుకూడా బ్రతికి చూడలేడు. '

రాణి : ' ఇప్పుడుపాయం. '

వీరమల్లు : ' తల్లి! పాలైనా విడువక పురిటిమంచం మీదున్న పసికూన యువరాజును ప్రతాప్ నకివ్వండి. కొంతమంది దాసదాసీజనుల నతనితో పంపండి. వారు రహస్య మందిరంద్వారా మహారణ్య మధ్యభాగంలో ఉన్న మునీశ్వరుల పర్ణశాలలకు వెళ్ళి తలదాల్చుకొన గలరు. '

అమ్మా! సమర చక్రం ఎటునుంచి ఎటుతిరుగుతుందో చెప్పలేం. జయాపజయాలు దైవాధీనాలు. తక్షణం యువ రాజుని రక్షించండి. రాజూ, రాణీ, ప్రజలూ, అంతా నశించి పోవచ్చు. కాని పసికందు యువరాజు ప్రాణాలైనా రక్షించు కొనడం మన విధి. ఈనాడు ఓటమి, దైవం ప్రతికూలం ఐతే మనకు రావచ్చు. అంతమాత్రంతో అధైర్యం చెందవలసిన పనిలేదు...

అమ్మా! మన చిట్టిబాబు చిరంజీవి అయితే భారత దేశానికి బానిసత్వం ఉండదు తల్లీ! పంపించండి ముందు. '

వీరమల్లు కళ్ళనిండా నీళ్లు నిండిపోయాయ్. ' నా దేశం బానిసదేశం అవుతుందా? ' అనే భావం తట్టగానే పాపం! ఆ ధైర్యం అంతా ఎక్కడికి పోయిందో పసిపిల్లవానిలా కన్నీళ్లు కార్చకుండా ఉండలేకపోయాడు.

వీరమల్లు కన్నీళ్లుచూచి, హృదయం కరిగి తనకన్నీళ్లు కూడా తరుముకొని వస్తుంటే, ముఖం చూపించలేక రాణీ శారదాదేవి లోపలకు వెళ్ళి ప్రతాపునికొరకు కబురు చేసింది.

ప్రత్తాపు రాగానే వీరమల్లు చెప్పిన ప్రకారం పసిబిడ్డను, పాలు గల తల్లులను, దాసదాసీజనులను ఇచ్చి. 'దీర్ఘాయుః ప్రాప్తిరస్తు' అని కన్నీటితో దీవించి పంపించినది.

పసికందు రాజభవనం వీడి వెళ్ళిపోగానే ఆమెకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది. స్వతంత్ర సమరాంగణంలో తన దేశాన్ని దూకించాలనుకుంది. శత్రు గళ నిస్రుత రుధిర ధారలలో తన కత్తిని ఎమరీత క్రొట్టించాలనుకుంది. రుధిర తిలకం వీరాంగనల ఫాలభాగంమీద అలంకరించాలనుకుంది.

మహాధైర్య సాహసములతో బయటకు వచ్చింది. వీరమల్లు అటూ ఇటూ కోదమసింహపుపిల్లలా తిరుగుతూ ఉన్నాడు.

రాణి : 'వీరమల్లూ! రక్షించానోయ్ మీ యువరాజునీ.'

వీరమల్లు : 'అమ్మా! మీరైనా, నేనైనా మన సైన్యాన్ని తీసుకొని కోట విడిచి వెళ్ళిపోవాలి.'

రాణి : 'నీకెందుకు. ఆ పని నేనే చేస్తాను. సైన్యాన్ని రాజుగారున్న దక్షిణగంగా ప్రాంతం వైపు నడిపిస్తాను.'

వీరమల్లు : 'మంచిది. మీరలా బయట మన సైన్యాన్ని ఉంచండి. నేను కోటతలుపులు వేసి లోపల సైన్యాన్ని ఆయత్తం చేస్తాను. శత్రువులు కోట ముట్టడించగానే, బయటనుంచి మీరూ, లోపలనుంచి మేమూ ఒత్తిడి చేద్దాం. దానితో శత్రువినాశనం తప్పదు. అవసరత్తి

రిలో పావుచెక్కల్లాగ ముక్కలు ముక్కలై పోవలసిందే.'

రాణి : ' మంచి ఉపాయం. అయితే సిద్ధంగా ఉండు. నేను తీసుకు వెళ్ళవలసి వచ్చిన సైన్యాన్ని పంపించు.'

వీరమల్లు : 'మంచిది. రణరంగమునకు సంసిద్ధులై యుండండి.'

రాణి : ' అలాగే. '

వీరమల్లు రాణీగారివద్ద సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు.

---

# V

ఊరులోఉన్న ప్రజల నందరినీ కోటలోకి జేర్చేశాడు వీరమల్లుడు.

శత్రువులు కోటచుట్టూ ఆక్రమించేశారు. దక్షిణ తీర ప్రాంతంలో యుద్ధం భయంకరంగా జరుగుతుంది.

ఉభయపక్షాల ప్రజలు యుద్ధ పిశాచానికి బలి అయి పోతున్నారు. నెత్తురు వరదలుగా ప్రవహిస్తూఉంది. కొత్త నీటిపోటుకు కూలిపోయి కొట్టుకుపోయే పాకల్లాగ, నెత్తుటి ఏటిపై శవాలు కొట్టుకుపోతున్నాయ్.

చచ్చిన ఏనుగుల పీనుగులు పర్వతాల్లా భయంకరంగా ఉన్నాయ్. జాతి కుల మత విభేదాలు లేకుండా; కత్తిఅందుకు ఎదురైన ప్రతికుత్తుకా, తన మొండంనుంచి వేరై నేలమ్మెకూలి

పోతున్నాయ్. పీనుగుల కుప్పలపై పీనుగులుపడిపోతున్నాయి. తలలు లేని మొండాలు ; కాళ్ళుచేతులు నరకబడిన మొండాలు ; మొండాలనుంచి వేరైన తలలు ; రణరంగంపై చెల్లాచెదురుగా పడిఉన్నాయి.

రణరంగం అంతా అతి భయానకంగా ఉంది.

ప్రొద్దుకుంకే వరకూ ఉభయపక్షాలూ బహుపరాక్రమ సమన్వితంగా యుద్ధం చేశారు. చచ్చినవారు చచ్చారు. బ్రతికినవారు బ్రతికారు. చచ్చినవారిగురించి విచారించేవారు లేరు. బ్రతికినవారిగురించి సంతోషించేవారు లేరు... ...వారందరికీ ఒకటే ఆశయం—అదే జయం.

అలిసిపోయిన సూర్యుడు అంబుధిలో కుంకిపోయాడు. అలిసిపోయిన యుద్ధవీరులు తమ తమ శిబిరాలలో కూలిపోయారు.

* * * *

అది అర్ధరాత్రి.

రాణీ శారదాదేవి తన భర్తకొరకు ఆలోచిస్తూ తన శిబిరంలో కూర్చుని వుంది. అంతలో తన శిబిరం ప్రక్కనే ఎవరో ఇరువురిలా మాట్లాడుకుంటూ ఉన్నారు.

'సాధువుల రూపాలతో వచ్చిన వందమందీ బ్రతికి ఉన్నట్లేనా ?'

'చెప్పలేం.'

'మిగిలిన వారంతా చచ్చిన శత్రువుల వేషాలు వేసుకున్నట్లేనా?'

'ఆఁ... వేసుకున్నారు. వారినిబట్టేకదూ మనం ఇలా రాగలిగాం.'

'రాణి నిదరపోతున్నట్లులేదు.'

'నీకేమీ భయంలేదు. నాతో రా.'

ఆమె ఉలుక్కుపడి లేచింది. నల్లత్రాచు తోకమీద నిలబడి అటూ ఇటూ పడగిప్పి చూచినట్లు చూచింది. క్రోధాగ్నులు కన్నులనుండి వెదజల్లుతూ నాలుగు మూలలా చూచింది.

'ఎవరురా అక్కడ?'

అని సింహగర్జన చేసి పిలిచింది.

వెంటనే 'అమ్మా' అంటూ పదిమంది సేవకులు వచ్చారు.

'నిదర పోతున్నారా?'

'లేదమ్మా!'

'ప్రక్కనే శత్రువులువాసన పసికట్టలేకపోతున్నారు.'

'చుట్టూ కాపలా ఉన్నారమ్మా!'

'కాపలా ఉన్నవారిలోనే కొందరు శత్రువులున్నారు.'

'జాగ్రత్తగా చూస్తాం తల్లీ!'

'చూడండి. శత్రుసర్పాలు మేలుకొనే ఉన్నాయ్. శారదా దేవిని కాటు వెయ్యడానికి ప్రయత్నిస్తున్నాయ్. వాటి తలలు చిదక కొట్టాలి.'

'చిత్తం.'

'వెళ్ళండి. వేయికళ్ళతో చూడండి.'

'మహా ప్రసాదం.'

'కన్ను మూశారా ప్రళయకాలాల మహాసముద్రం మిన్నులు ముట్టేటట్టు పొంగిపోతుంది. హిందూ దేశాన్నే ముంచెత్తుతుంది.'

'చిత్తం.'

భటులు బయటకు వెళ్ళిపోయారు.

ఆమె ఆలోచనలో మునిగి పోయింది. ఆమె చుట్టూ శత్రువులున్నారని ఆమె గ్రహించింది. కాని ఆ శత్రువులను పట్టుకొనే మార్గం కనుపించక ఆలోచనలో పడిపోయింది.

* * * *

అది తెల్లవారుఝాము.

అంతా మత్తులో ఉన్నారు.

శత్రుసైన్యంలో ఇద్దరూ దాసీలవేషం వేసుకొని రాణిని విషవాయు ప్రయోగంతో చంపాలనుకున్నారు.

లోపలకు వెళ్ళారు....

రాణీగారు పడుకున్నా మంచంక్రింద విషవాయువు పెట్టారు. ఇంక కొన్నిక్షణాలలో రాణీగారు చనిపోతారుకదా అని వారి ఆనందం వర్ణించలేం.

అంతలో రాణీగారి మంచంప్రక్కనే పండుకొన్న కుక్క గిలగిలా తన్నుకుంటూ చచ్చిపోయింది. మరో క్షణానికి రాణీ కూడా చనిపోయి తీరుతుందనుకుంటూ బయటకు వెళ్ళబో తున్నారు అంతే.

గుమ్మందగ్గర నిలబడ్డా రాణీ శారదా దేవిగారిని చూచే సరికి వాళ్ళు గజ గజ వణికి పోయారు. భయంతో కన్ను మూశారు. అంతే.

కన్ను మూసినవారు కన్ను మూసినట్లే ఉన్నారు. రాణిగారి పదునుకత్తి ఒకే వేటలో వారి రెండుతలలను మొం డాలనుంచి వేరు చేసింది. వారి రెండుతలలు గిఱ్ఱుమని తిరిగి ఆ చచ్చినకుక్క తలమీాద రక్తతర్పణాలిస్తూ పడ్డాయ్.

రాణీ తన కత్తిని ఒరలో పెట్టింది. ఇయిద్దరూ తన శిబిరం ప్రక్కన ఆడినమాటలు విన్నప్పటినుంచీ నిద్రపోలేదు. తన పక్కమీాద డాలు పెట్టి దుప్పటి కప్పి, బయట పారావాళ్ల తోపాటు తనూ కాపలా కాస్తూంది. ఆ సంగతి శత్రువులకు తెలియలేదు.

ఆమెను చంపాలని వచ్చారు. వారే చచ్చారు. 'చెరపకురా చెడేవు' అనే ఆర్యోక్తి ఊరకేపోతుందా?

శారదాదేవి కత్తిముందు శివతాండవం చేసిన పగతుర మొండాలు రెండు నిముషాలైన తరువాత క్రిందబడి మట్టి కరుచుకున్నాయ్. తలలులేని వారిగతి అంతేకదా !

---

# VI

కాలపురుషుడు తూర్పుదిక్కుపై విసిరిన నెత్తుటి ముద్ద లాగ సూర్యుడుదయించాడు కత్తులనంటిన నెత్తుటి జిడ్డును తుడుచుకుంటూ మహావీరులు యుద్ధానికి సంసిద్ధులౌతున్నారు.

రాణీ శారదాదేవి తన రథంమీద నిలబడి భౌముక శంఖాన్ని భయంకరంగా మ్రోగించింది. దశదిశలు మారు మ్రోగిపోయాయి.

శత్రుసైన్యంకూడా సంసిద్ధులయ్యారు. ఫిలిప్ వీరోలు తమ తమ శంఖాలను పూరించారు.

అతి భయంకరంగా యుద్ధం జరుగుతూంది. మధ్యాహ్నం గడిచేసరికి జయం శత్రుపక్షానికే లభించింది.

హిందూదళాలు విచ్ఛిన్నమై పోయాయి. ఏనుగులూ గుఱ్ఱాలూ చెల్లాచెదరై పోయాయ్. హిందువులదే అపజయం అని నిర్ధారణ అయిపోయింది.

శత్రుసైన్యం కోట ముట్టడించింది. కోటలోనుంచి వీరమల్లు అతిభయంకరంగా యుద్ధం చేస్తున్నాడు. వీరమల్లు

ఘాకికి ఆగలేక శత్రువులు వెనుకంజ వేస్తున్నారు. సాయంకాలం అవుతుంది. శత్రువులు కోటనుంచి వెనువెనుకకు వెళ్ళిపో తున్నారు.

చీకటి పడింది.

శత్రుసైన్యం చెదిరిపోయే సమయంలో, యువరాజును మునుల ఆశ్రమాలలో దాచిన ప్రతాప్‌సింహుడు కొండకోన ల్లోను, అడవుల్లోనూ ఉన్న భిల్లులను సిద్ధం చేసుకొని కోట దగ్గరకు వచ్చేశాడు.

శత్రువులు కోటలోఉన్న వీరమల్లుసైన్యం ఘాకికి ఆగ లేక పారిపోబోయే సమయంలో వీరంతా విల్లంబులతో ముట్ట డించారు.

శత్రువులపై లోపలనుంచీ వెలుపలనుంచీ బాణాలు వర్షం క్రింద కురిపించి వేస్తున్నారు. ఆ కారుచీకటిలోనే యుద్ధం భీభత్సంగా జరుగుతూంది. యుద్ధభటుల 'హా హా' రావాలు మిన్నులు ముడుతూ ఉన్నాయ్. ఆరాత్రంతా అలాగే యుద్ధం చేస్తూఉన్నారు.

తెల్లవారింది

యుద్ధం విడువకుండా సాగుతూనేవుంది.

శత్రువులకు మార్గాలు తెలిశాయి.

రెండు భాగాలుగా విడిపోయారు. ఒకభాగాన్ని ఫిలిప్ రాజునడుపుతున్నాడు. వేరొకభాగాన్ని వీరోనడుపుతున్నాడు.

ఉభయపక్షాలూ అతి ధైర్య సాహసాలతో యుద్ధం చేస్తున్నారు.

అలా మూడు రాత్రుళ్ళు, మూడుపగలూ హోరా హోరిగ యుద్ధం చేశారు. ఎడతెగకుండా యుద్ధం చేశారు.

కాని—

నాలగవ రోజు రాత్రి శత్రుసైన్యం కోటతలుపులు బద్దలుచేసేశారు. వీరమల్లు శరీరం నిండా గాయాలే. రక్త ధారలు ప్రవించుకు పోతున్నాయి. తన శక్తినంతా వినియోగించాడు. కాని, తన దేశాన్ని రక్షించుకోలేక పోయాడు.

కోటతలుపులు బద్దలై పోగానే హైందవుల నందరినీ మరో మార్గంద్వారా బయటకు పంపించేశాడు. అంతా వెళ్ళి పోయారు. తానూ నలుగురు భటులూ శత్రువులకు ఎదురుగా వెళుతున్నారు.

పీరో ఫిలిఫులు గుర్తుపట్టారు.

ఫిలిప్ : 'పీరో! వాడే మనలను నమ్మించి మోసగించిన వీరమల్లుడు. వీడితల నరికి కోటగుమ్మానికి కట్టాలి.'

పీరో : 'వాడినెత్తురు భారత దేశ సింహాసనం ముందు పార బొయ్యాలి.'

ఫిలిప్ : 'వాడిని ముక్కలు ముక్కలుకోసి గద్దలకువెగరేస్తే.'

పీరో : 'పచ్చడిక్రింద చిదకకొడితే బాగుంటుంది.'

ఫిలిప్ : ' బాగు. బాగు. '

వాళ్ళు ఆనందంగా ఎదురు చూస్తున్నారు. వీరమల్లు వారికి ఎదురుగా చిరునవ్వుతో వెళ్లాడు.

ఇరువురి గుర్రాలూ ఎదురు బొదురయ్యాయి. ఫిలిప్ వీరమల్లునిపై కత్తి దూయబోయాడు. వీరమల్లు గుర్రంమీద నిలబడి. ఫిలిప్‌కు నమస్కరించి ' ఒక్కమాట ' అన్నాడు:

ఫిలిప్ : ' చెప్పవోయ్ త్వరగా. '

వీరమల్లు : ' ఒక్క నిమిషం ఓపికపట్టి వినాలని ప్రార్థన. '

వీరో : ' నీ నక్కజిత్తువేషాలు మా దగ్గర పనికిరావు. జాగ్రత. నీ శిరసు నీ మొండెంనుంచి వేరయ్యేలోపల త్వరగా చెప్పు. '

వీరమల్లు : ' నా శిరసు నా మొండెంనుంచి వెళ్ళితే నేనేకాదు; ఎవ్వరూ చెప్పలేరు. అలా వేరు కాకముందే ఒక విన్నపం. '

ఫిలిప్ : ' చెప్పు త్వరగా ! '

వీరమల్లు : ' ఓ ఫిలిప్ మహారాజా ! నీవు భారత దేశానికి మహారాజువయ్యావ్. నీ బలపరాక్రమ శౌర్య ధైర్య గాంభీర్య ఔదార్యములకు మేమంతా ఆనందిస్తున్నాం. రాజ్యం నీ చేజిక్కింది. మేమంతా నీ భటులం. ఇదిగో నా కత్తి మీకిచ్చేస్తున్నాను. నేను యుద్ధం చెయ్యే

డానికి రాలేను. మీరు నన్ను భటునిగా గ్రహిస్తే మీ కోటగుమ్మం కావలా కాసుకుంటూ బ్రతుకుతా. లేదా నా తలనరికి మీ కోటగుమ్మానికి కట్టినా సరే మీ దయ. మీ చేజిక్కిన బంటును. '

ఆ మాటలంటూ కత్తి ఫిలిప్ చేతికిచ్చాడు. ఫిలిప్ ఆనందం చెప్పలేం.

ఫిలిప్ : ' వీరమల్లూ ! నీ భక్తికి మెచ్చాను. నిన్ను చంపినా, కుక్కను చంపినా ఒకటే పోయి నా కోటగుమ్మం కాపలా కాయి. '

వీరమల్లు : ' ప్రభువుల ఆజ్ఞ. '

జై ఫిలిప్ మహారాజుకు జై. అంటూ జయ జయ నినాదాలతో ఫిలిప్ రాజు యావత్ సైన్యం కోటలో ప్రవేశించింది.

శత్రురాజు జయజయ ధ్వానాలు వీరమల్లు హృదయం నిర్భేదకంగా ఉన్నా భరించి కోటగుమ్మం దగ్గరకు వెళ్ళాడు.

అంతలో భారతీయుడొకడు వీరమల్లు దగ్గరకు వచ్చి, ' వీరమల్లూ ! రాజూ రాణీ బంధింపబడ్డారు. వారిద్దరూ కోటలోఉన్నారు. వారిని రక్షించే భారం మీది. ' అని చెప్పి వెళ్ళిపోయాడు.

వీరమల్లు కొన్ని నిమిషాలు అలాగే స్తబ్దుడైపోయాడు.

వెంటనే గుఱ్ఱం తిప్పాడు.

శరవేగంగా ఫిలిప్ దగ్గరకు వెళ్ళిపోయాడు.

వీరమల్లు : ' మహారాజ్ ! '

ఫిలిప్ : ' ఏం వీరమల్లూ ! '

వీరమల్లు : ' మీా ఈభక్తుని నమస్కారములు అంగీకరించ ప్రార్థన. '

ఫిలిప్ : ' అంగీకరించా. మళ్ళీ కోటవిడిచి వచ్చావే. '

వీరమల్లు : ' ఒక్క ప్రార్థన. మీారు భారతదేశ సింహాసనాన్ని అధిష్ఠించేముందు ఒక్క పనిచెయ్యాలి. అది తమరకు తెలియదు కాబట్టి విన్నవించడానికి వచ్చాను. '

ఫిలిప్ : ' ఏమిటది ? '

వీరమల్లు : ' పూర్వం ఒక మహారాజు ఇలాగే వెనకాముందూ చూడకుండా సింహాసనం అధిష్ఠించ బోయాడు. కాని పాపం ! తల వెంటనే వేయి చెక్కలుగా ముక్కలై పోయింది. '

ఫిలిప్ ఆమాటలతో హడలి పోయాడు.

ఫిలిప్ : ' వీరమల్లూ ! ఏం ? ఎందుచేత ? ఏంచెయ్యమంటావ్ ? '

వీరమల్లు : ' మహారాజా ! సింహాసనం ఎక్కేముందు ఒక మహారాజు సిరసు కాని, ఒక మహారాణి సిరసు కాని

కోటగుమ్మానికి కట్టాలి. సింహాసనం ఆ కోటగుమ్మం మీద మహారాజు తల చూడపోతే, సింహాసనం ఎక్కిన వానిని ముక్కలు చేస్తుంది.'

ఫిలిప్ : 'అలాగా.'

వీరమల్లు : 'మహారాజా ! సింహాసనం వెనుక రెండు శక్తు లుంటాయ్. ఆ రెండు శక్తులకూ బలిదానంగా రాజూ రాణీ ఇద్దరు సిరసులూ బలిచేసి కోటగుమ్మానికి వేల కడితే, మీకు మళ్ళీ అపజయం ఉండదు. ఒక్క రాజు గారి శిరస్సైనా పరవాలేదు. అది చెప్పడానికే వచ్చాను.'

ఫిలిప్ : 'వీరమల్లూ ! నీభక్తికి మెచ్చాను. ఒక్క రాజు శిరస్సే కోటగుమ్మానికి కట్టే కర్మం ఏమిటి వీరమల్లూ ! రాజూ రాణీ ఇద్దరి శిరస్సులూ కలిపి కోటగుమ్మానికి కట్టవచ్చు.'

వీరమల్లు : 'అదిచేసి మరీ సింహాసనం ఎక్కమనే నాప్రార్థన.'

ఫిలిప్ : 'అయితే రాజూ రాణీలను ఎవరిచే చంపించమం టావ్ ? నీవు చంపగలవా ?'

వీరమల్లు : 'చంపలేకే—కాని మీ వీరో చంపితే బాగుంటుం దనుకుంటా.'

ఫిలిప్ : 'అవును. మా కక్షా తీరుతుంది. మన పనీ జరుగు తుంది...వీరో ! ఏమంటావ్ ?'

వీరో : ' అంతకంటే ఆనందం ఏముందీ ? '

ఫిలిప్ : ' అయితే బంధితులైన ఆ రాజూ రాణీని తీసుకు వెళ్ళు. త్వరగా వాళ్ళతలలు కోటగుమ్మానికి కట్టు. '

వీరో : ' తప్పక. '

వీరో బంధితులైన రాజూ రాణులను గుఱ్ఱాలమీద ఎక్కించి తీసుకు వెళుతున్నాడు.

ఫిలిప్ సింహాసనం ఎక్కకుండా ఆగిపోయాడు. వీరో రాజూరాణిని తీసుకొని బయలుదేరాడు. రాజూ రాణీ వెనుకే వీరమల్లు బయలుదేరి వెళుతున్నాడు.

అంతా కోటగుమ్మందగ్గరకు వెళ్ళారు. వీరో రాజును రాణిని ఆగమన్నాడు. వా రాగారు. వారిని ఆఖరు ప్రార్థన చేసుకోమన్నాడు. వారలాగే చేసుకుంటున్నట్లున్నారు.

అంతలో వీరో కత్తి ఎత్తాడు. రాజూ రాణీ తలలు ఒకేవేటుకి నరకబోయాడు. కాని తన తల వీరమల్లుని కత్తి వల్ల వేరైపోతుందని తెలీదు పాపం ! ఎత్తినచేయి ఎత్తినట్లే ఆగిపోయింది. కత్తి కత్తిలాగే నిలిచిపోయింది. తన తల మాత్రం వేరైపోయింది.

వెంటనే వీరోసైన్యం వీరమల్లుపైకి ఉరకబోయారు. వీరమల్లు వారిని తరిమి తరిమి కొట్టాడు. వీరో శిరను బాణానికి గ్రుచ్చి ఫిలిప్ దగ్గర పడేటట్లు కొట్టాడు.

తన రాజునూ రాణీని రక్షించుకొని కోట దాటించి, శత్రువులు కోటనుంచి బయటకు రాకుండా కోటతలుపులు వేసేశాడు.

రాజు : 'వీరమల్లూ ! ఇప్పుడు మనం......'

వీరమల్లు : 'అన్నీ సిద్ధంచేశాను......'

ఆ మాటలంటూ ఉరికేలోపునే కొందరు కాగడాలు తీసుకొచ్చారు. కోట లోపలభాగం అంతా అగ్నికి ఆహుతి చేశారు. కోటచుట్టూ నిప్పు ముట్టించారు.

శత్రువులు బయటకు రాలేక, లోపల ఉండలేక ఆ నిప్పులోపడి దగ్ధం అయిపోతున్నారు. రాణిహృదయం కరిగి పోయింది.

రాణి : 'వీరమల్లూ ! వారి నామంటలో అలా మాడ్చివేయడం ధర్మం కాదోయ్. ఓడిపోయిన వారెలాగైనా ఓడిపోయారు.

వీరమల్లు : 'అమ్మా ! యుద్ధానికి ఓడిపోయింది మనంకాని, వారు కారు. ఈపని చేయకపోతే మన పవిత్రసింహాసనంమీద ఆ తుచ్ఛుడు కూర్చొనుట ఖాయం. అప్పుడు ఓటమి ఎవరిదవుతుందో ఆలోచించండి.

తల్లీ! రాజశాసనానికి హృదయం లేదు. అది అతి నిశితం అయింది ; కఠోరం అయింది. జాలి దలచి ఫిలిప్‌ను

రక్షించారు. అతడు విశ్వాసం చూపగలిగాడా? పాముకు పాలుపోస్తే అమృతం కక్కుతుందా తల్లీ! విషపు జాతి, విషపుజాతే...

రాజతంత్రం వేరు. ధర్మమార్గం వేరు.

రాజు: 'అవును వీరమల్లూ అవును. ఈ అగ్నిలో వారు శలభాలలా నాశనం కావలసిందే.'

వీరమల్లు: 'తప్పదు.'

రాణి: 'తప్పదా?'

వీరమల్లు: 'తప్పదు లేకపోతే మనకు సింహాసనం తప్పిపోవడం తప్పదు.'

రాజు: 'వీరమల్లూ! యదార్థం చెప్పావ్.'

రాణి: 'శత్రువులైనా అలా నల్లుల్లా మాడ్చి చంపడానికి నా హృదయం ఒప్పడంలేదు.'

వీరమల్లు: 'హృదయం ఉన్నవాళ్ళకు యుద్ధమే ఆనందదాయకం కాదు..'

అమ్మా! 'నా దేశం' కొరకు ప్రాణాలు బలిచేస్తాను అనే పసుపు కంకణం కట్టిన ప్రతి భారతీయునకు శత్రు రుధిరాస్వాదనంలో ఉన్నా తృప్తి దేంట్లోనూ ఉండదు.

యుద్ధభటుని జీవితం ఒక మహాయజ్ఞం. నిరంతరం రుధిరమే హవిస్సుగా వేస్తూ ఉంటాడు.

'ఇది నా దేశం. నా దేశ స్వాతంత్ర్యం నా జన్మహక్కు. నా దేశానికై నేను బలి అయిపోతాను' అనే పవిత్ర భావమే అతనిచేత అధ్వర్యం చేయిస్తుంది.

అమ్మా! 'నా దేశం' అని గర్వంగా చెప్పగల హక్కు ఒక్క రాజుకూ, రాణీకే కాదు—ప్రతి భటునకు, ప్రతి పౌరునకూ ఉంది. దేశస్వాతంత్ర సముపార్జనకు రాజు ఎంత బాధ్యుడో ప్రతి పౌరుడూ అంతే బాధ్యుడు. జయాపజయాలు ఒక్క రాజుమీదే ఆధారపడి లేవు; జయాపజయాలకు ప్రతి పౌరుడు కారణభూతుడే.

అమ్మా! శత్రువుల వధించడానికి ప్రతి గడ్డిపరక పదును కత్తి కావాలి ప్రతి రెల్లుగడ్డి ఒక ఈటె కావాలి. ప్రతి పొదా ఒక డాలు కావాలి. ప్రతి పువ్వూ ఒక అంబు కావాలి.

కవులు కలాలు కత్తులుగా మారాలి. చిత్రకారుల కుంచెలు బాణాలుగా మారాలి. వారి పాత్రలు డాలులుగా మారాలి. ప్రతి నటకుడు వీరగాధలే నాటకాలాడాలి. ప్రతి గాయకుడూ వీరోచితగాధలే గానం చెయ్యాలి. ప్రతి నర్తకుడూ నటరాజ భయంకర తాండవం చెయ్యాలి.

ప్రకృతి ప్రతిప్రాణి హృదయంలోనే పౌరుష రేఖలు వెలార్చాలి. గుండెలు మండించి ఎఱ్ఱని నెత్తుటి మంటలు రేకెత్తించాలి...అప్పుడే ఇది పవిత్ర భారతదేశం అవుతుంది. అప్పుడే ఇది పుణ్యభూమి అవుతుంది.

రాణి : 'శభాష్ వీరమల్లూ ! శభాష్ ! నీవు చెప్పిన ప్రతి పదం నగసత్యమే. నీవు చెప్పినవన్నీ ఒప్పుకుంటాను. 'ఇది నా దేశం, దీనికై నేను బలికావాలి' అనే పవిత్రాశయాలు నీకుండబట్టే నీ రాజును రక్షించు కున్నావ్ ; నీ రాణీని నీవు రక్షించుకొన్నావ్ ; నీ దేశాన్ని నీవు రక్షించుకున్నావ్...నీ ఋణం నిజంగా యావద్భారత దేశం కలిసి తీర్చుకోలేదు—నీకు మా ధన్య వాదాలు'

వీరమల్లు : 'బిడ్డలు చేసే ప్రతి పనీ తల్లుల కానందమే కదా ?'

రాజు : 'నిజం. నిజం.'

వీరిలా మాటాడుకుంటూ ఉంటే, కోట వెలుపలున్న ప్రజలనందరినీ ప్రతాప్‌సింహుడు తీసుకొచ్చాడు.

తరువాత అంతా ఒక్కుమ్మడిగా కోటలోకి వెళ్ళి, మంటల్లోపడి చావగా మిగిలినవారిని చంపి, మంట లారిపి వేశారు.

వీరమల్లు ప్రతాపసింహులు ప్రజలంతా తన రాజునకు జయ జయ ధ్వానాలు చేశారు.

రాజును మరల సింహాసనాధిష్ఠుని చేశారు.

యువరాజును ప్రతాప్‌సింహుడు తీసుకొచ్చాడు. పసి కందు యువరాజును చూడగానే శారదాదేవి ముసి ముసి నవ్వులతో తల వంచుకొంది.

రాజుగారు ఆనందసంభరితుడై తన అనుంగు తనయుని ఎత్తుకొని లాలించాడు.

ప్రజలంతా రాజూ రాణీలను యువరాజునూ ఆశీర్వ దించారు.

వీరమల్లు ప్రతాపసింహుల బలపరాక్రమ శౌర్య ధైర్య సాహసాలను కొనియాడారు.

'నాదేశం—

నాదేశస్వాతంత్ర్యం నా జన్మహక్కు.

నాదేశం కంటే మించినది నాకు లేదు.

నాదేశం నాప్రాణతుల్యం.'

అంటూ అంతా భరత మాతను నుతించారు; పూజించారు; భక్తి గీతాలు పాడారు.

శ్రీసత్యనారాయణ ప్రెస్, రాజమండ్రి ఇ. జే. 34. (26-8-46 కా. 1000.)

శ్రీ జంపనవారి క్రొత్తనవలలు

1 నాజేకం

2 దేవదాసి

3 మొక్కుబడి

4 సేవకురాలు 1 వ భా॥

5 సేవకురాలు 2 వ భా॥

☆ ★ ☆

శ్రీ కొవ్వలివారి క్రొత్తనవలలు

1 కాశీయాత్ర

2 కామాంధుడు

3 యముని తీర్పు

4 చెయ్యిజారాక?

5 మిస్. శైలా

6 డబ్బుప్రధానం

7 ఒ స్త్రీపెళ్ళాం

8 కోతలంగాడు

9 కర్మకాదు

---

వలయువారు—

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.